# చాదస్తాల చెల్లమ్మ

రామేశ్వరము, కాశీ, ప్రయాగ, గయ మొదలగు క్షేత్రములన్నియు చక్కగాచేసికొని వారదోగ్యమైన కాటిపట్టుగ్రామమున పరమావస్థ జరుపుకొందమని ప్రవేశించిన చెల్లమ్మయు నామెయన్న విస్సప్పవధానియును, వీరిర్వురు పావమ్మోడబులు. బ్రాహ్మండపంతులుగారి పెరటిపాకల్లో కాపురము పెటుచేసి వచ్చినప్పటినుండియు దక్షిణ లద్దుగట్టుకొని వండుకొని కాలక్షేపమొనర్చుచున్నారు. చెల్లమ్మకొస్తులపురిటిలో నే వైధవ్యమువచ్చినది. ఆ యేవిధముగా వచ్చినదో చాలమందికి తెలియదు కాని యామెయన్నయ్య విస్సప్ప కొక్కనికే తెలియును. ఇందులోనంత చిత్రమేమియు లేదు. నీళ్ళు గల్లిదండులు మూట పొట్ట మీదనుండగనే వ్యవసాయదార్లు వర్తకులకు ధాన్య

ము కడుపుకక్కుఱితో యెంతోలకో జాతియిచ్చినట్లు
నీమె తల్లికడుపున బుట్టినప్పటికీ గర్భదరిద్రదోషమున పె
ళ్లో పెళ్లోయని యేడ్చుచువచ్చిన పెద్దయ్యగారి నిర్భం
ధముచేతను స్వకాలము వలనను పదివందలరూపా
యీలకు జాతివివాహ మొనర్చినది. కాని యాతల్లి
దండ్రులకు వేయిరూపాయిలే దక్కినవి కాని పెద్దయ్య
య్యగారు పెండ్లాము శిరోదయమైనా చూడకుండా
యాలోకముతో నున్న యప్సరసల నంటికొనుటకుగా
నోలు గఘాలున రవానాయైపోయినాడు. పదిమరి నాల
రోజులకే చెల్లమ్మ భూపతనమైనది. ఆరోజుననే యి
రుగుపొరుగవారామె వెధవయన్నారు. కొందఱు కో
డెగాండ్రు కోతులులాగున నవ్వజొచ్చినారు. కాని
యిప్పటినుండి యీరురోజులూ పండితమండలిలో మ
హావాగ్యుద్ధమై యారుకాడు. వెధవయే యేమిచే
యుచున్న దానిప్రారబ్ధము పుష్పిణి కాకుండానే భూమి
మీద పుట్టకుండానే యీపాడుముండ్యలేని మాటలంటించి

బొడ్డుకోయకుండానే జట్టీవివాహము వార్ద్తత్తములోని
కివచ్చి శాస్త్రార్థములబట్టి యీమె యీపెద్దయ్య పే
రుచెప్పుకొని ఉన్నంతకాలము వైఘస్యమై తలచెడి ఆ
ధీనముతప్పి లేటుసువాసినీసరి ముండమోయకతప్పద
ని తీర్పు చెప్పిరి. అంకటినుండి కూచెల్లమ్మ యట్లే పె
రుగుచున్నది. ఇప్పటికి భూమికెన్నేండ్లైనదో యన్ని
యేండ్లు యించుమించుగా నామెకు కాజొచ్చినది. చి
న్నప్పటినుండి నేర్చినా వైధవ్యముగనుక నామె
యాచారములలో సాంప్రదాయములలో ఉప్పపిండి
చేసికొనుటలో పిండివంటలువండి శాలింతరాళ్లను పె
ళ్లికూతుళ్లను మేపుటలో పాంచిపనిచేయుటలో సాం
ప్రదాయములలో స్వైపిన్నైదక వ్యవహారములలో
తద్దినములలో ప్రాచీగాంతి మొక్కుబడో వివాహములలో
స్థాళీపాకములలో గా౦ఋ్క పిండిపిసికించవలెనో వప్పు
నానబోయవలెనో ంరియుటలో మహాప్రవీణురాలై
యేమాన్లోనూనాన్న అనుకూలింపకశికొను చెల్లమ్మ

ప్ప అది యేలాగ యిది యేలాగ" అని యడిగించు
కొని యందఱితలలోను నాలుకయై కాలక్షేపమొనర్ప
గల్గుచున్నది.

ఆచారములతోనున్న మెలకువలన్నియు బూ
ర్తిగా దెలియును. యేదిముట్టుకొని యేదిముట్టుకొనగూ
డదో యేదివండి యేదివండగూడదో యేవస్తువేకాల
మున నెక్కడ జాగ్రత్తచేయవలెనో యీబాపతు
గూటచిక్కులన్నియు హస్తామలకమువలె మూలవే
ళ్ల బెట్టుకొని యడిగిన్పుడు చెప్పుటయేకాక యొక్కడై
నా యేమాత్రము తేడావచ్చినా యప్పుడే వ్వహరించి
యెట్టివారివల్ల నదిసంభవించినా దానికి మొగముమీ
ద తుభుక్కున నుమ్మివేసినట్లు కష్టపఱిచి పొయ్యి
లో బెట్టునట్లు కంగున కంచుగంటవలె మూడుము
క్కలుగా ముచ్చటింపగలదు. స్వయముగాచేసి చూ
పించే యాచారముల బుఱ్ఱగూటచే యామెనెవ్వరు తే
ఱిచూడనైన జూడలేక యేమియన్నా యన్లే కిక్కురు

మనకుండా చేసినారే దిద్దుకొనుటయో లేకపోతేనోయి మూసుకొని యూరకొనుటయో జరిగించుచుందురు. ఈపురుటిలోనుండియు జరుగుచున్న శ్రీపచారిత్రమంత యు వ్రాయవలసివచ్చినచో నొక భాగవతమంత పు రాణమై మఱియే శాస్త్రీయ పురాణమువలెనోనై కల కాలము నంతవ్రాసివచ్చును. స్థాళీపులాక న్యాయము గా నక్కడక్కడికథలే యుక్కడముగోల్పి యమ్మక్క చెల్లా; యనిపించకమానవు. నాయారోనాడు వైధవ్య ము స్థిరపడినదికదా; యాపైనిరోజునుండి బిడ్డకు స్నా నమువేళ పసుపునామునుబెట్టని యొకసందేహమున్నా ఉగులో పసుపుకొమ్ముగల్పిన భాగపుగుంత యెట్లువే యవచ్చునని యొకసిద్ధశాస్త్ర విచారణేమాంశము న్ను, తరువాత సన్నిటికంటె గట్టిదిక్కైన దేవియన గా బిడ్డతలకు నూనెరాసి దువ్వవచ్చునాలేదా! కేశ ఖండనమా: మండనమా? యనియే. ఈవిషయములు తోబాటు చనుబాలుకదా తాగుచున్నది! కాలింత

ము హానిరాకుండా చను కొలువట్టవచ్చును. అని సం
శయవిచ్ఛేదమొనర్చిరి. పుచ్చుకున్న వేయిరూపాయి
లలో సగభాగము తల్లినగలనిమిత్తమై ఖర్చుకావుట
చేతనున్నూ తండ్రి ధర్మశాస్త్రమున కడుగుదాటని మ
హాబాంధవ బ్రాహ్మణుడవుటచేతను, ఆనాటినుండి ధ
ర్మహానిరాకుండ తల్లి వైధవ్యలక్షణములన్నియు ప
ట్టించివైచెను. అంతటితో పాపము మన చెల్లెమ్మ వై
ధవ్యము కొంతభారము తగ్గినది. కాని అన్నప్రాశనము
నాటి పరమాన్నమునకు బదులుగా ఉప్పుపిండి మన్ను
లోగల్పి రుద్రాక్షకాయలో నాటించిరి గనుక పాపభ
యము లేకపోయినది. అక్కడనుండి [illegible]
దా కాలుకలేదు. ఇప్పటి నవనాగరికపుటిల్లలోని పిం
టిబిడ్డలువలెనే ఫ్యాషను వైధవ్యము అనుభవించినది. తెం
పింఛను వచ్చి తప్పటడుగులనాడే యేమా చెల్లెమ్మా నీకు ధ
ర్మమా అని పాడగియా త్రిస్నానము విభూతిలేప
నము మెడలో రుద్రాక్షధారణము నామెకు సిద్ధించి

నవి. భూపతనము కాకుండానే బొట్టుబొట్టు పోవలసిన చెల్లమ్మకు క్షీరపానమునాడే యాచారము మడితడి వచ్చుటలో నాశ్చర్యమేమున్నది? అప్పటినుండి తక్కిజ కావుటకు యిరుగుపొరుగునున్న బాలరంభాసమాజములో బనాయింపబడి చక్కగా చాదస్త్రాలకొమ్మ కాజొచ్చినది.

ఈమెయన్న విస్సావధాని ఘట్టు:అవధానియే; కాని చదువుకొని సంపాదించిన పెట్టుపేరుమాత్రము కాదు. ఆతడెనుబదేండ్లు దాటినా భీష్మాచార్యులు వలెనస్ఖలితబ్రహ్మచారి. తలిదండ్రులు బ్రదికియున్నన్నినాళ్లు నాతనికి మూడుముళ్లుపడుటకు విశ్వప్రయత్నమొనర్చిరి. కాని చెల్లమ్మకొఱకుచ్చుకొన్న వేయి రూపాయిలు తల్లినగలకు తండ్రితద్దినాదస్త్రావేజా తీర్మానమునకు తరువాత నేమైనాయుంటే ధర్మసందేహములుతీర్చి పదిమందిలోను పరువునిలబెట్టుచువచ్చిన పద్మనాభశాస్త్రిగారికి ఖర్చులయిపోయినది. మళ్లీ

యొకదట్టీవివాహము చేయుదుమంటే తల్లికివచ్చిన యు
ప్రార్వపై ధన్య లక్షణముంచే నాపాటియదృష్టము న
ల్పట్టినదికాదు. ఇఁకనేను విస్సప్పావధానిగారికి పెళ్లి
కాగలదు? కార్యము లేక నిలువుబెంగబడి తల్లిదండ్రు
లు పరలోకము తరలిపోయినారు ఇఁకచేయునదిలేక వి
స్సప్ప పిత్రియమైన ముమ్మానికచెంబు తెల్లగాతోమి
చెల్లెమ్మకుతనకు లోటురాకుండా కాపాడుచున్నాడు.
అంతటితో నాతనివివాహఘటాకో యందఱికి తీరిపో
యినది జరిగినన్నినాళ్లు కొన్ని యూళ్లో కాపురముచేసి త
రువాత రెండవయూరికి ప్రయాణమునర్చి ముమ్మా
నికచెంబే అక్షయపాత్రగా కన్నవృష్టముగా గాలక్షేప
మొనర్చుచున్నారు. విస్సప్పమాత్రము తండ్రిపోలిక
వాడౌటచే మహావాదస్థముగా ధర్మశాస్త్రములను
గుదాటకుండా దైవానుగ్రహమువలన లంబాటుపడు
చున్నాడు. ఇట్టివీరిద్దరు బ్రహ్మండపంతులుగారి పె
రటిసావిట్లో ప్రవేశించినదిలగాయతు పంతులుగారి

హాయిగా నిద్రపట్టుచున్నది. ఎందుచేతననగా నీయు న్నా చెల్లెండ్రి కేరాత్రియుగూడ నేదేనొక యాచార ము విషయమైననూ సాంప్రదాయముగూర్చి ననూ ధర్మ సందేహమువచ్చి రాద్ధాంతసిద్ధాంతము కాకుండనుం డదు. ఆనందపిల్లో నే వెట్టివాంగోపా పంతులుగారిం ట్కురా సాహసించుమని కనుకనే యిట్లు గుండెలమీద చేయివేసికొని యాయాసపడుకొనేవాడు.

మేన త్తమగనితల్లి కన్నగారికోడలి మైలపట్టిలో యనా కాదాయన్న విషయమొక్కసారి వాగ్వాదమునకు ద గాయిదాపడి రెండుపోజులు రెండురాత్రులు హోరా హోరికి ఘోరయుద్ధముజరిగి పోట్లాటకట్లు చింకిచేట లు చీపురుకట్టలు ఘటాఘటలు పొయ్యిలోకట్టెలు నన్నిగూడా చిందరవందరలై యుపోయి యాంధ్రులకు ఫై తీసువారువచ్చి ముమ్మాటికి చంబు సదరానాక్కో ని కానంతతీర్పు చెప్పుతేనేగాని చల్లారినదికాదు. నత్య ఋషివంటి బ్రహ్మాండపంతులు గారుగాని యాంతకం

టి హెచ్చుమెచ్చుల నెఱదాతయై యడుగనివారికిడి పాత్ర
ముగా పరోపకారార్థమే బ్రదుకుచున్న యాయన భా
ర్యకాని యెప్పుడూ వీధ్ని పంచవదలి పొమ్మని పొడు
చుకొని తిరలేదు కనుక నిన్నినాళ్లు గడుచుచున్నవి. ఉ
దయము కాకుండానే చెల్లమ్మ యాయమ్మల్లో యెవరి
యింట్లో లేగడికాకుండా చూడూకాకుండా పాలూలే
కుండా పెయ్యకాకుండా యుండే యావున్నదో వాక
బుచేసి యుంచికొని గుమ్మడికాయయంత గోమయ
ము విశ్వప్రయత్నమువిూద శ్రీకృష్ణుని మేలుకొలుపు
లు పాడుకొనుచు అకణోచయు మనోనిశ్చల్లగా బ
ట్టుకొనివచ్చేను. అప్పటికప్పుడే విస్సప్ప లేచి కల్యాకృత్య
ములుతీర్చుకొని పెరటినూతికడ ఫెళ్ఫెళమని నాల్గుచే
దలుసిక్లి స్నానముచేయుచుండేవాడు. అంతలో నెచ
ల్లమ్మవచ్చి;“ అన్నా నీకెముగమింత యెబ్బిసైనై
నావేమిటి; నూతిలో గోమయము వేయనిచే చేదము
ట్టించినావా;’’ యని కొంచెము అనగా నిమ్మకాయ

యంత గోమయము నూతిలో వేసి పోసుకొంటూవున్న
చేదలో కరక్కాయంత పసవేసి పవిత్రమొనర్చేది.
విస్సప్పగార్లు చెల్లమ్మచేత చీవాట్లుబడినా న్యాయము
గా నెంతో నిష్ఠనియముగలవాడే: ఆఖరుకు పవిత్రస్నా
న మొనర్చినవాడై తులశికోటవద్ద పరిక్కవేయున్న
పెద్దదిమ్మపై సుఖాసీనుడై యధోచితసమయమునకు
సంధ్యావందన మాచరించుటకు మొదలుపెట్టేవాడు
రాగిచెంబుమీదనుంచిన గుల్లెచెంబులోవైచిన బుల్లి
యుద్ధరిణితో రెండునీళ్లు చేతబోసికొని యతినిష్ఠతో
కేశవాయనియాచమనముచేసేవాడు, కాని పాపమందు
లో ఉదాత్త మొత్తి పలుకులేదని సందేహించి భూః
భూః యని మళ్లీ యీసారిమాటి పట్టుదలతో కే.శ-
వా.యని యుచ్చరించేవాడు కాని యీమాటవలె సా
దయికావలసినదానికంటె నొక్కుడెక్కుడైనదని యీ
సారి తప్పక తప్పులేకుండా చెప్పటకై యత్యంతశ్ర
ద్ధతో నుద్ధరిణిలోనినీళ్లు చేతిలోబోసికొని కేశా-వాయ

నేవాడు ఛేన్-యేథ్-థూః థూః యీమారియున లేత
గులువడినదని యూఖరున కెట్లో యుష్టకష్టములుపడి కే
శవనామములు కడతేర్చేవాడు, ఆమధ్య పేకనీళ్లతో
నొకసారి అంట్లగిన్నెలతో నొకతూరి ముగ్గుబుట్టలతో
నొకమారు అక్కడకువచ్చి తనకున్న సంధ్యావందన
పాండిత్యవిశేషము తేటపడువట్లు దిద్దబ్రియత్నించేట
ప్పటికి విన్నప్పకెక్కడలేని కోపమువచ్చి గోమూచెడి
యెంతో కష్టపడి ఉత్తిష్టంతువరకు వచ్చిన సంధ్యావం
దనమును మళ్లీ తంటాలుపడేవాడు. ఇన్నైట్లో కష్టపడి
జాముపొద్దెక్కునప్పటికి అర్ఘ్యప్రదానమువఱకై న
యీనాస్పియూపొద్దుకదినమూత్ర మొనర్చి చెల్లెమ్మత్రయి
చ్చిన చెంబుచేతబట్టి సీతారామాభ్యాంనమః అనుట
కేగేవాడు. అక్కడనుండి మనచెల్లమ్మ మెల్లగ మన్న
గుడ్డలన్ని బిందిలోకుక్కుకొని చీమంతచింతవండు చే
తబట్టుకొని నీలాటిరేవున కేగుచుండేది. పురటిలోనే
పోయిన మొగునివోట్లో చిక్కుకొంటానేమో యని

బాగారిగాడి ధర్మమాయని బుజ్జచరిమిడి గుండుక్రిం
ద చెక్కించివేయుట యలవాటౌటచే లెక్కపెట్టి వీ
లులేదుకాని నిశ్చయముగా వెంట్రుకలొక్కవేయిచేద
లనీళ్లు పోసికొని ముందుబ్రాపడుపుకొనుట యాహెం
యాచారములలో మొదటిపాఠము. బట్ట తడియుట కెం
తటైనా పదివందలచేదలు కాకతప్పదు. కుడిచెవిలో
కొసరికొసరి కొన్ని చేదలు యెడమచెవిలోని కన్ని చేద
లో లెక్కలేదు. పాదములు రాతిబండమీద. నొక్కి
నొక్కి రాసిరాసి రాపాడించుటకధమము అనూతిలో
నీళ్లన్ని కాకతప్పదు ఈమధ్యతనకు నవీనముగానే
పుణ్యస్త్రీవచ్చినానదియే మళ్లీ మొదటినుండి అనగా బు
జ్జోదుపుట దగ్గఱనుండియు స్నానము ప్రారంభించవ
లసినదే గ్రహచారముచాలక యీహెం చేద స్తపుస్నా
నమునకు వేచికొనియుండలేక యీబాబాకరపుటాదు
దిగుచునా యువతలివైపు చేదయారంభించినదంటే అంత
టితో ఆనూయి పైలబడిపోవుట తటస్థింపకతప్పదు.

అందుచేతనే జ్ఞాపకముండినప్పుడెల్లా పెద్దదబ్బకాయ
యంత గోమయము పైటకొంగునగట్టుకొని తెచ్చుకొ
ని భద్రముగా నూతిగోడకంటించి చేదవేసినప్పుడల్లా
నూతిలో కాస్త చేదలో కాస్తా ఆనీళ్లెక్కడ వినియోగిం
చునో యెక్కడ కాస్తా యిట్లు గోమయముతో పరమ
పవిత్రమొనర్చుచుండేది అప్పుడుమాత్రము కొంచెము
సులువుగా స్నానము తేలుటయున్నది. ఇల్లు నీళ్లు దో
డుకొని భుజముమీద బిందిపెట్టుకొని గూడయంగిచే
దలో చేదెమునీళ్లుబట్టుకొని యమగమగునకు కొంచె
ముకొంచెము దారిలో బోసికొనుచు దారిలోనొకచో
మసిబాగ్గున్న దేమో యని వంగివంగి పరకాయించి లే
దని నిశ్చయించుకొనుటలో పదిమంది సాక్ష్యము పు
చ్చుకొంటేనేకాని యడుగుపెట్టదు. అల్లామె యతిజా
గ్రిగా పరమనిష్ఠాగరిష్ఠయై మంచినీళ్లు దెచ్చుకొను
దారిలో గ్రహచారముచేత మాలవాడెదురువచ్చినా
లేక మాలవానివలె వర్చస్సుతోనున్న వాడొకడు

వచ్చినా బండబూతులుతిట్టుచు నాబిందెడునీళ్లు భళ్లు
న పారబోసికొని మళ్లీ పునఃప్రాణాయమ్మా యని మొ
దటికుండి అనగా స్నానముదగ్గఱనుంచీ ప్రారంభించి
తంటాలుపడవలసినదే; పాపమాచెల్లమ్మ యేరోజైనా
మూడుసార్లు బిందెనీళ్లుపారబోసికొననిదే యిల్లుచేరలే
దు. ఈమె నీళ్లు యిల్లుచేరేటప్పటికి తప్పక రెండుజా
ములు కాకమానదు. అంతట పొయ్యిలో నిప్పురాజవే
యుట కొకగంట పట్టకమానదు. పొరుగమ్మ కొంత
టికుడితో నిప్పిచ్చినను చెల్లమ్మ చెంబుడునీళ్లతో శు
ద్ధిచేసికొననిదే చేతితోనైనా ముట్టుకొనదు. అందుచే
తనే యీనిప్పుచప్పగాచల్లారి మళ్లీపొగలేచునప్పటికి
చెల్లమ్మ యూపిరితిత్తులలో కొంతబలము ఖర్చుకావ
లెను భగవంతుడిచ్చే కొంతగాలీ ఖరాబుగావలెను.
చచ్చిచెడిరాజవనిప్పులలో దాపెట్టినపుల్లలలో నొక్క
టైనా యీచెల్లమ్మ శుభ్రముగా పేడనీళ్లతో కడి
గికడిగి శుద్ధచేసికొనకుండనుండదు. ఇకవంట ప్రారం

భిం మనప్పటికి డెబ్బదితరములనుండి యాలోకమునకే గినయందఱు తాతయ్యలుదిగి వచ్చితీరెదరు. అక్కడి యాచారములలోనిగమ్మత్తు యింతింతయని వర్ణింపజాలము కట్టుకొన్నబట్ట యారుదల చూపినదన్నప్పట్కి మళ్లీ వదిచేదలు నెత్తిమీదపోసికొనరావలసినదే గుడ్డనుండి కొంగునుండి కొలకులనుండి కనుబొమ్మలనుండి కాళ్లుచేతులనుండి యానీళ్లుయట్లు కారకపోయినచో చెల్లమ్మకేమాత్రము తృప్తియుండదు. కూర వండినతరువాత నన్నము వార్చవలసివచ్చినచో మళ్లీ ప్రొయ్యి అలుకవలసినదే; పులుసుపెట్టిన ప్రొయ్యి మీదనింకనేమియు వండగూడదు. పోపుగరిటె పులుసులో నెప్పుడుపెట్టినా యాగరిటె మళ్లీ పనికిరాదు. అనగా నాగరిటె సరబుట్టెడిపేడలో పాతిపెట్టినగాని శుద్ధి కాదనియే యావిడయభిప్రాయము. ఇట్లుచచ్చిచెడిచేయంగలవిస్తపము లొనర్చివంట తయారుచేసి యప్పుడేవచ్చిన యన్నయ్యమీద నటుకాస్తా యిటుకాస్తా

వినుగుణొని ప్రొద్దున్న యలికినవసారా మళ్ళి యప్పుడు తుడిచి రొంచెము గోమయముతో కుదించికుదించి పవిత్రిమొనర్చి మూడుసార్లుకడిగిన యరటాకుమళ్ళి గోమయపునీళ్లతో శుద్ధిచేసికొని యాతడినేలమీద చక్కగబఱచి మళ్ళినాల్గు నీళ్ళచుక్కలు చిలకరించి అన్నము తప్పేలా యంతరిక్షమార్గమునుండి యక్కేపట్టుకొని వచ్చి చచ్చేచావుపైన వడ్డాము వడ్డించేది. అన్నముతప్పేలా యట్లావడ్డించినతరువాత నాప్రొయ్యిమీద బెట్టగూడదు కమక కాస్త యివతలగా దిగవిడిచి చేతులు గడిగికొని కూరవడ్డించేది. గృహాచారముచాలక నేయియింట్లో యున్న మొదల నందు మళ్ళీరవ్వంత గోమయముపేసికొని గాచుకొనకుండా యెవ్వడు వడ్డించేదికాదు. విన్నప్పావధాని భోజనమొక యజ్ఞమైపోయేది; వడ్డించేచెల్లెమ్మ చేతులుగడుగుకొనుటకు అన్నమీదనప్పుడప్పుడువచ్చే యపచారములకుబల్లె పేడనీళ్లకుమొత్తముమీద రోజుకింపిలన్నీ ఖర్చుఅగుచుం

చేసి. ఈ బాధపడలేక విస్సావధాని యొక్కడనైనా సోడామడలలో భోజనము దొరుకుతున్నా నరిగో బ్రదుకుజీవుడాయని పాత్రపోవుచుండేవాడు. ఉన్నరోజులలో చెల్లమ్మ భోజనము చంద్రోదయమునకు బూర్తియాట యులవాటు భోజనమైన వెంటనే పొద్దున్నచో తులశికోటకు గోవిందనామాలు పాడుకొనుచు చెల్లమ్మ పత్తి బుట్టలో వత్తులు వేయుచు గూర్చుండుటయే యభ్యాసము.

ఆవిడ గోవిందనామము లందుకొనవలెగాక యుద్భుతముగానుండుటచే నాసమయమున కొందరియమ్మలక్కలందరూ ఆలకించుటకువచ్చి చెల్లమ్మకింతసహాయము చేయుచుండేవారు.

దిక్కుమాలిన వారికి గోవిందారామ.
దేవుడే దిక్కండి గోవిందా;
తండ్రి చేసిన పాపాలు గోవిందారామ।
నిష్టనే పోషించు గోవిందా॥

తల్లిచేసిన దోషంబు గోవిందారామ।
మాతుర్ని కొట్టునూ గోవిందా॥
అటుకులకు అజీర్ణము గోవిందారామ।
అమ్మోర్రి జాతర్లు గోవిందా॥
పురిటిలో పెళ్లిళ్లు గోవిందారామ।
బిడ్డాల చంపుళ్లు గోవిందా॥
విధవలకెవ్వడు గోవిందారామ!
వత్తియే గతియానూ గోవిందా॥
వత్తులుచేయించి గోవిందారామ।
శాస్త్రికకనశాలు గోవిందా॥
ఎదురుపట్టినకాంత గోవిందారామ।
కళువుజూడగబోదు గోవిందా॥
అరోగ్యమిచ్చేది గోవిందారామ।
ఆచారమంటారు గోవిందా॥
మొగుడుపోయినయమ్మ గోవిందారామ।
మూలగూర్చుండునే గోవిందా॥

యాత్రాలు చెయ్యాలి గోవిందా రామ।
పాత్రాలు తోమాలి గోవిందా॥
పుస్తికట్టినవాడె గోవిందా రామ।
మొగడు కాడంటమ్మ గోవిందా॥
పెళ్లాడు తానని గోవిందా రామ।
డబ్బిస్తె చాలమ్మ గోపిందా॥
బాలరండల బ్రదుకు గోవిందా రామ।
బాజారు సొరకాయ గోవిందా॥
ముసలి ముండల బ్రదుకు గోవిందా రామ।
ముందుగా తిండమ్మ గోవిందా।
గొడ్డురండల బ్రదుకు గోవిందా రామ।
దుష్టుగంగాలమ్మ గోవిందా।
కొడుకుతల్లుల బ్రదుకు గోవిందా రామ।
కోడళ్ల కొరడాలు గోవిందా॥
విధవలసృష్టించే గోవిందా రామ।
బ్రహ్మకు గుడిలేమ గోవిందా॥

తర్కాలు వ్రాసినా గోవిందా రామ।
దయ్యాలుమునులెల్ల గోవిందా॥
చెప్పేటిశాస్త్రుల్లు గోవిందా రామ।
దుబ్బ్యాసూస్తుంటాడు గోవిందా॥
దిక్కుమాలివారికి గోవిందా రామ।
దేవుడే దిక్కండి గోవిందా॥

ఇట్లెన్నినూర్ల పాటయో యామెరుకవచ్చును. ఆపాట పాడుచున్నప్పుడు ఒడలుపులకరించి వినవచ్చిన యమ్మలక్కలెల్లరు చేదస్త్రాలచెల్లమ్మ గోవిందనామాలు అచ్చువేస్తే బాగుండేదేయమ్మా యనుకొనుచు నింటికిపోవుచుందురు

సంపూర్ణము.



# రబ్బరు స్టాంపులు.



అనేకరకముల అందమైన షేపులలో స్టాంపులు అతిచౌకగా చెక్కబడును.

తారీఖు నెలల స్టాంపులు వగైరాలు కూడ మెల్లపుడు దొరకును. సీళ్ళు దస్కతు స్టాంపులు కూడ పరిశుభ్రముగా తయారుచేసి యివ్వబడును.

సిటీ ప్రెస్, కాకినాడ.

